## నోటీసు

కాకినాడ ప్రిన్సిపల్ సబ్ కోర్టులో
O. P. 25/46

పిటిషనరు:- నాయన వెంకటస్వామిపాత్రుడు
రెస్పాండెంట్లు:- 1 Dr. నాయన నరసింహమూర్తి, 2 యీ ముకుందమ్మ.

పిటిషనరుకు తండ్రి అయిన లేటు నాయన నరసమూర్తిపాత్రుడుగారికి Indian Postal and Telegraph Department Policy No. 717-F క్రింద రావలసిన సొమ్ము మొత్తంలో సగం తనకు యిప్పించుటకు Succession Certificate నిమిత్తం పిటిషను దాఖలు చేసినందున ఎవరికైనా ఆక్షేపణలున్నయెడల ది 25-7-46 ని పగలు 11 గంటలకు హాజరై తెలుపుకోవలెను.

సమయమంత్రి అన్నపూర్ణ పంతులు,
26-6-46 పిటిషనరు తరపు ప్లీడరు.

## NOTIFICATION

NOTIFICATION UNDER Sections 166 and 167 of the District Municipalities Act fixing the street alignment and building line for the main bazzar road commencing from the Railway station road and Kandakam road on its north to the junction of Kambham choultry road on the south.

Whereas it is considered imperative to initiate steps for the widening of the main bazzar road the council resolves to prescribe the street alignment and building line for the main bazzar road as follows:

The main road will have a uniform width of 40'-0" (commencing from the Railway station road and Kandakam road on its north to the junction of Kambham choultry road on the south) as indicated on the blue print plan approved by the Director of Town Planning in No. T. P/D. T. P. 27 46 and which was appended to the notification. This blue print plan shows the buildings etc. affected. The building line will be at a distance of 6'-0 from the street alignment on either-side.

A copy of the plan with street alignment and building line marked therein is kept for inspection during office hours at the Municipal office.

No person shall erect or add to any building between the street alignment and the building line except with the written permission of the Executive Authority who shall permit only an arcade satisfying the following conditions.

(1) The arcade should be supported on pillars, columns or piers uniformly erected in a line parallel to the street alignment and should be open towards the street and the ends.

(2) Any building or part thereof which does not conform to the building line may be required by the Executive Authority to be set forward or set back to the building line to facilitate the construction of the arcade: the height, spacing of pillars, columns, or piers, elevation and construction of the arcade should be such as the Executive Authority may consider suitable to the street or should conform to the type-design as the council might have approved and laid down for the purpose.

(3) No portion of the arcade should be used as part of a shop godown or the other building or as a verandah or be otherwise utilized in any way as to effect or interfere with the use of the space occupied by the arcade contrary to the purposes of the building line.

(4) No portion of the arcade should be constructed or made to project beyond the street alignment.

(5) The ground floor land of the arcade should be of such height not exceeding 0" above the level of the street immediately in front of the arcade as the Executive Authority may specify or as might have been specified in the type-design approved by the council.

The public are hereby informed that the council will be prepared to hear all objections filed in this behalf under provision 2 of section 166 of D. M. Act in the council meeting to be held on 31-7-1946 provided they are filed in writing and delivered at the Municipal Office not less than 3 clear days before the meeting of the council to be held on 31-7-1946 in time as contemplated in the said Act.

P. S. VASUDEVAN,
Commissioner.
20-6-46. Municipal office,
Rajahmundry.

## ప్రకటన

సంద్యాలలో మా ఆంధ్ర దినపత్రిక, సచిత్ర వార, భారతి మాసపత్రికలను వారి స్వంత బాధ్యతపై అమ్ముటకు శ్రీ మారం లక్ష్మయ్యగుప్తగారిని శ్రీ ఎ. నారాయణగారిస్థానే మా న్యూస్ వెండరుగా ది 1-7-1946 నుండి నియమించినాము.

* * *

చల్లపల్లిలో మా ఆంధ్ర దినపత్రిక, సచిత్ర వార, భారతి మాసపత్రికలను వారి స్వంత బాధ్యతపై అమ్ముటకు శ్రీ నందమూరి వెంకట సుబ్బయ్యగారిని మెసర్స గిరి అండు కంపెనీ వారి స్థానే మా న్యూస్ వెండరుగా ది 1-7-1946 నుండి నియమించినాము.

మేనేజరు,
ఆంధ్రపత్రికా కార్యాలయము,
మదరాసు.

## గంటల పంచాంగం

వ్యయ సం॥ ఆషాఢ శు॥ చవితి
1946 సం॥ జూలై 2 మంగళవారం
మం॥ నవమి రా॥11-7 ఆశ్రే ప 2-13 వర్జ్యం రా 1 54 ల 3-28కు.
శు॥ పంచమి జూలై 3 బుధవారం
బు॥ పంచమి రా 10-1 కు ప 1 85 వర్జ్యం రా 9-39 ల 11-16 కు.



ఆంధ్రపత్రిక
వ్యయ సం॥ జ్యేష్ఠ బ॥ చవితి
మంగళవారము

## 'ఆటంబాంబు'

ఆటముబాంబు శక్తిని తెలిసికొనుటకుగాను సోమవారము తెల్లవారుజామున పసిఫిక్కు సముద్రములోని మార్షలుద్వీప సముదాయములోని బికిని అటోల్ అనె ప్రదేశముమీద బాంబు ప్రయోగించబడినది. ఈ ప్రదేశము 21 మైళ్లకుపైగా పొడవు, 11 మైళ్లు వెడల్పుకలిగి సిటిమయుమై వివిధరకములైన పెద్ద నావలు 97 ఉండుటకు వీలున్నది. బాంబుపడిన తరువాత జీవులమీద ఫలితము ఎటులుండునో తెలిసికొనుటకుగాను, మేకలు, గొర్రెలు, తదితర జంతువులను ఆ ఓడలమీద వదలిపెట్టిరి. ఆద్వీపములోనున్న ప్రజలను తీసికొని వచ్చేసిరి. ప్రదర్శనమును చూచుటకు కొన్ని మైళ్ల దూరములో శాస్త్రజ్ఞులు, అధికారులు ఉండిరి. ఈ పరీక్షకగు ఖర్చు పదుకోట్ల డాలర్లు అని అంచనా వేసిరి.

సోమవారము తెల్లవారుజామున వేసిన బాంబు ఫలితముల వివరము లింకనూ తెలియలేదు. బాంబుపడిన రెండునిముషములలో ఉన్న నావలన్నీ కనుపడకుండ పోయినవి. పొగతో కూడిన మంటలు 50 వేల అడుగుల ఎత్తున లేచినవని తెలియుచున్నది.

ఇంతకు పూర్వము పరీక్షలు జరిగినవి. సూర్యకాంతిని మించిన వెలుగు, ప్రళయపవనాన్ని మించిన వేడి వాయువు, తరువాత పొగల మేఘమువంటి ధూళి ఉత్పన్నమగునని గ్రహించబడెను. జపాను పైనిక కేంద్రమగు హిరోషిమామీద ప్రయోగింపబడినప్పటి ఫలితములున్నవి. గత సంవత్సరము జూలైమాసమున మెక్సికోలో ఎడారియందు ప్రయోగింపబడినది. దాని ప్రతిభ ఇంకను అక్కడ సాగుచునే యున్నది. సామాన్య పద్ధతిలో మానవుడు ఆ ప్రదేశమునకు వెళ్లి సాహసించుటకు వీలులేదు. మొదటి బాంబు ప్రేలుడువల్ల కలిగిన మెరుపువల్ల ఆరు మైళ్ల దూరములో ఉన్న ఒక మనిషి కళ్లు పోయినవి. 50 మైళ్లదూరములో ఉన్న ఇల్లు ఊగిపోయినది.

ఇవి మానవుని ప్రత్యక్ష అనుభవములు. ఇక ఊహించెడివి ఇంకనూ భయంకరము, విచిత్రమునై యున్నవి. అమెరికాలోని "సైన్సునిక్షను" అను పత్రిక ఈ ఆటంబాంబుల శక్తిని గురించి ఈ విధముగ తెలిపెను "ఆటము బాంబులు పగిలినపుడు, రేడియము, ఎక్సు రేస్, తదితర కిరణములను ప్రసారించగలవు దానివల్ల మానవునియొక్క జీవకణ స్వభావ స్వరూపములలో మార్పు కలుగును. ఈమార్పువల్ల మనిషికి మూడు కళ్లు ఏర్పడవచ్చును, లేక అసలు కళ్లే లేకుండ పోవచ్చును. అలాగే అసలు చేతులు లేకపోవచ్చును లేక ఒక డజను చేతులు రావచ్చును. ఇలాంటి విచిత్రములకు సాధ్యమున్నది. అందువల్ల విశేష జనాభాగల ఒక ప్రదేశాన్ని ఆటంబాంబు ప్రయోగానికి గురిచేయబడినట్లయితే అక్కడేమి సృష్టి అయేదీ చెప్పుట కష్టము. రెండు గుండెలుకల మనుష్యులు జన్మించటానికి సాధ్యమున్నది." బెకిన్ అటోల్ ప్రదేశమును పరీక్షచేసిన పిమ్మట ఇటువంటి విచిత్ర, వికృతములకు ఎన్నింటికి సాధ్యమున్నదో తెలియగలదు.

మానవుడు తన శాస్త్ర పరిశోధన కారణముగ భయంకరమైన శక్తిని కనుగొనినాడు. ఆశక్తిని సాధనసామగ్రిలో ఇముడ్చుకొన కలిగినాడు, దానివిధ్వంసక చర్యల కుపయోగించునో లేక శాంతి అభివృద్ధి ప్రయోజనముల కుపయోగించునో చూడవలసి యున్నది. అదే నేడు ప్రపంచము నెదుర్కొనిన సమస్య.

ఆటంబాంబు ద్వితీయ ప్రపంచ సంగ్రామ సృష్టి. జపాను శరణాగతిక కారణమై ప్రపంచయుద్ధమును సమాప్తి నొందించినది. కాని దానితోబాటు ఒక విషాదచ్ఛాయను ప్రపంచముమీద కప్పినది. సంగ్రామ సమాప్తికి శాంతి రక్షణకు కారకులమని చాటుచున్న అగ్రరాజ్యములలోనే విభేదములకు కారణమగుచున్నది. దాని నిర్మాణ రహస్యము చెప్ప అమెరికా అయిష్టత చూపినది. కాని క్రొత్తగా ఒక సూచన చేసినది. ఆటం అభివృద్ధి అధికార సంస్థ అను ఒక అంతర్జాతీయ సంస్థను స్థాపించవలెననీ, ఆ సంస్థ ఆటంశక్తి ఉత్పత్తిని అరికట్టియుంచుటగాక, అది పర్పరచిన నిబంధనలను ఉల్లంఘించిన వారిని శిక్షించుటకు అధికారమును కలిగియుండవలెనని అమెరికాసూచన. ఈ సంస్థ ఏర్పడుటతోనే నిర్మాణమై యున్న ఆటంబాంబు లన్నిటిని నాశనముచేయవలెను. బాంబు నిర్మాణమునకు ఉపయోగపడే ముడిపదార్థము లన్నిటిని ఆ సంస్థ తీసికొని శాంతియుతమైన నిర్మాణ కార్యములకు వినియోగింపవలెను. అనగా ఆ పదార్థములు ఏ దేశములో నున్నప్పటికీ ఈ సంస్థ సేకరించుటకు అధికారము కలిగియుండ భద్రతా సంఘము క్రింద కాక, సంయుక్త రాజ్యసమితి అధికారము క్రిందనే యుండవలెనని కూడ అమెరికా ప్రతిపాదన తెలుపుచున్నది. ఈ ఏర్పాటువల్ల భద్రతా సంఘములో అగ్రరాజ్యములకున్న వీటో అధికారము పోయి అసలు సమితి సభ్యులకే ప్రాప్తించగలదు. దీనికి రష్యా అంగీకరించలేదు. అందుకు మిగిలిన రాజ్యములమీద రష్యాకుగల అపనమ్మకము వ్యక్తమగుచున్నది కాని, రష్యా అభ్యంతరము సహజముగా సవ్యమైనదని రుజువగుటలేదు.

ఈ విధముగా అగ్రరాజ్యములలో ఆటంబాంబు పరస్పర అవిశ్వాసమునకు కారణమగుచున్నది. తద్వారా శాంతిస్థాపనకు నిరోధమగుచున్నది. ఆటంబాంబు కన్న శక్తివంతమగు ఆయుధమును నిర్మించ రష్యా ప్రయత్నించుచున్నది. దానిని చాలవరకు సాధించినట్లు రష్యను పత్రిక ఇజ్వెస్టియాలో ప్రకటించిన వ్యాసము తెలుపుచున్నది.

దేశములు కనుక ఆటంబాంబుల యుద్ధము సాగించిన ప్రపంచ వినాశమునకు మరొక సులభ మార్గము లేదు. ఇంతవరకు తెలిసిన ఫలితములు బాంబును పైనుండి వదలుటవల్ల మధ్య పగులుటవల్ల తెలిసినవే. ఇంకనూ రెండు రకముల పరీక్ష లున్నవి. ఒకటి భూమిమీద పగులుట, రెండవది నీటిలోపల ప్రేలుట. వాటి ఫలితములు ఇంకనూ భయంకరమైయుండునని శాస్త్రజ్ఞులు భయపడుచున్నారు. కాబట్టి ఈ పరిస్థితిని చూచిన అసలు శాస్త్రపరిశోధన అనునదే విరమించిన శ్రేయస్కరమని కొందరు విజ్ఞులు బోధించుటలో ఆశ్చర్యము, అతిశయోక్తి ఏ మాత్రము లేదు. ఉపయోగకరములగు కార్యములకు ఈ శక్తిని ఉపయోగించవచ్చునని చెప్పవచ్చును. కాని దానివల్ల కలుగు లబ్ధికంటె దాని నిర్మూలనమువల్ల కలుగు శాంతి, భద్రత ఎక్కువ వాంఛనీయములు. శాంతి స్థాపనకు కూడ ఆటంబాంబు వినియోగము సమర్థనీయము కాజాలదు. ఆ శక్తిని సేకరించినంత కాలము మానవుడు అణువులలో కలిసిపోయే ప్రమాదమును ఎదుర్కొనవలసియున్నది. కాబట్టి అసలు ఆటంశక్తి ఉత్పత్తిని నిషేధించుచూ ప్రపంచ రాజ్యములు నిర్ణయించవలసి యున్నది. ఆటంబాంబు నిర్మాణము సత్యాగ్రహ సిద్ధాంతమునకు పరమప్రమాణం మని రుజువుచేయుచున్నది.

## వయోజన వోటింగు హక్కు

మదరాసు, జులయి 1: మదరాసులోను, కాకినాడలోను, ఆంధ్రదేశంలో విశాఖ కాకినాడ గుంటూరు ఏలూరు వాల్తేరు మునిసిపాలిటీలందు. అరవదేశంలో నాల్గు మునిసిపాలిటీలందు, మొత్తం 10 చోట్ల ముందుగ వయోజనులందరికి వోటింగు హక్కు యిచ్చి ఎన్నికలు జరిపించుటకు స్థానికశాఖమంత్రి గా॥ తామసుగా రొక స్కీము ఆలోచిస్తున్నారు.

## ఆచార్య రంగా

మద్రాసు, జూలై 1: ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు ఆచార్యరంగాగారు రాయలసీమ సంచారం ముగించుకొని ఈ ఉదయం యిక్కడకు వచ్చారు. ఉదయం ప్రధాని ప్రకాశం పంతులుగారిని కలుసుకొన్నారు. తిరిగి రేపు రాత్రి మెయిల్లో బయలుదేరి 3 తేదీ జరుగు రాష్ట్ర కాంగ్రెసు సమావేశానికి హాజరయ్యేందుకు బెజవాడ వెళతారు. అక్కడనుండి 4 తేదీ బొంబాయి బయలుదేరతారు.

## ఏటంబాంబు విధ్వంసకశక్తి

1 వ పేజీ తరువాయి

ఐదు నౌకలు ధ్వంసమైనవని దూరంలో ఉన్నవారు తెలుపుతున్నారు.

ముందు ఊహించినట్లుగానే "రేడియో యాక్టివ్" మేఘం ఒకటి ఏర్పడి అటూ ఇటూ పరుగులిడుచున్నదట. 'లాంప్సన్' అనే యుద్ధనౌక బాంబు ప్రేలుడు దెబ్బకు పల్టీ కొట్టిందని తెలుస్తున్నది.

మొత్తం 34 వేల మంది ఉద్యోగులు చేరి ఈ ప్రయోగాన్ని నడిపారు. వీరిలో ఏ ఒక్కరికీ అపాయమేదీ సంభవించ లేదు.

బాంబు ప్రయోగ కార్యక్రమం ముందుగా వేసుకున్న పథకం ప్రకారమే జరిగింది. 'నివాడా' నష్టపడినప్పటికీ దాని సమీపంలోని రవాణా నౌకధ్వంసమైందట.

గత సంవత్సరం నాగసకిపై ఏరకం ఏటం బాంబును ప్రయోగించారో, ఇప్పుడు బికినీవద్ద అదేరకం బాంబును ప్రయోగించారు.

ఏటంబాంబు ప్రేలగానే కొన్ని వేల అడుగుల ఎత్తుకు చిత్రమైనరంగులతో పొగలు, మంటలు లేచినవని అమెరికను అసోసియేటెడ్ ప్రెస్ విలేఖరి తెలుపుతున్నాడు. ఈ ప్రేలుడులో ఎవరికీ ప్రమాదాలు సంభవించలేదు.

'డేవ్స్ డ్రీమ్' విమానాన్ని నడిపిన వైమానికుడు మేజర్ వుడ్రో స్వానకట్ ఈ బాంబు విధ్వంసక శక్తిని 12 మైళ్ల దూరం నుంచి పరిశీలించటానికి వీలైంది.

ఏటంబాంబును ఇదే మొదటిసారిగా చూసిన మేజర్ హెరాల్డ్ వుడ్ అమెరికన్ అసోసియేటెడ్ ప్రెస్ ప్రెస్ ద్వారా ఇలా తెలియజేస్తున్నాడు. "నేను బాంబును చూడటం ఇదే మొట్టమొదటిసారి దీన్ని చూడగానే ఒకవిధమైన వింత భావాలు రేకెత్తినవి. గుండె జలదరించింది."

'డేవ్స్ డ్రీమ్' వైమానికుడు మేజర్ వుడ్రో స్వానకట్ ఇప్పటికి నాల్గు నెలలుగా జరుగుతున్న ఏర్పాట్లు నేటికి ఫలించబోతున్నందుకు పంతో సాన్ని ప్రకటిస్తున్నాడు. తాను బాంబువేస్తే గురి తప్పడమంటూ లేదని ఇతడి ధైర్యం.

ఏటంబాంబు పడగానే దాని ప్రేలుడువల్ల ఏర్పడిన గాలి ఒత్తిడికి సూపర్ ఫోర్ట్రెస్ విమానంలోని రేడియో యంత్రం చెడిపోయింది.

ఈ ఏటంబాంబు ప్రయోగవార్తను బ్రిటిషు పత్రికలన్నీ ప్రాధాన్యం మొదటిపేజీలలో ఈ ఉదయం అచ్చువేసినవి. ఈ ప్రళయం బాంబు శక్తి సామర్థ్యాలే లోకశాంతికి హామీ కావాలని వాంఛిస్తు సంపాదకీయాలు వ్రాసినవి మానవ నాగరికత నిలబడేదీ, నాశనం కావడమూ ఈ బాంబు శక్తిమీదనే ఆధారపడివున్నదట.

## ముందుగా ఏర్పాట్లు

బాంబువేసే సమయంలో బికినీ ప్రాంతమున 20,000 అడుగుల ఎత్తుకు పైవరకూ వాతావరణం కొద్దిగా ఒడుదుడుకుగా వున్నట్లు పరిశీలనమీదట తెలిసింది.

మొట్టమొదట ఏటంబాంబును కనిపెట్టిన వ్యక్తుడు దాన్ని విమానంలో పెట్టుకొని ప్రయోగించిన వైమానికుడు జెప్టెన్ జేమ్స్. ఇతడు న్యూయార్కులో విమానప్రమాదం సంభవించి మరణించాడు. ఇప్పుడు బికినీపై ఏటంబాంబును ప్రయోగించిన బ్రహ్మాండమైన వాయుదుర్గ విమానానికి అతనికి జ్ఞాపకంగా "డేవ్స్ డ్రీమ్" అనే పేరు పెట్టారు.

బికినీలో చేర్చిన నౌకాసముదాయంపైన 'డేవ్స్ డ్రీమ్' విమానం బాంబును ప్రయోగించడానికి పూర్వం ఐదుసార్లు విహరించాలనే నిర్ణయం పెట్టుకున్నారు. ఐదోసారి ఆ నౌకల పైకి వెళ్లగానే ఏటంబాంబును 30 వేల అడుగుల ఎత్తునుండి జారవిడవాలి. ఐదోసారి పరిస్థితులవల్ల బాంబును ప్రయోగించలేకపోయినట్లయితే, ఆ విమానానికి తిరిగి 24 గంటల విరామం ఇవ్వాలనుకున్నారు.

బికినీవద్ద చేర్చిన నౌకలలో ముఖ్యమైనవి "నివేడా" "ప్రిన్స్ యుజెనీ" లు. ఇది గాక ఇంకా దాదాపు 120 నౌకలను కూడా వుంచారు. జపానువారి యుద్ధనౌక 'నగాటో' కూడా ఒకటి. జపానుతో యుద్ధం జరుగుతున్నప్పుడు హిరోషిమా, నాగసాకి నగరాలపై ఏటంబాంబును 2 సార్లు ప్రయోగించారు. ఇప్పుడు వేసిన దాన్ని కూడా కలుపుకుంటే మొత్తం మూడు బాంబులు ప్రయోగించినట్లవుతుంది.

ఏటంబాంబు ప్రేలగానే ఆకాశమునాక లన్నీ ఒక్కసారిగా తెగిపోయి ఒక దానిలో ఒకటి కలిసిపోయినవి...

బికినీపై ఏటంబాంబు ప్రయోగానికి ముందుగానే ఏర్పాట్లన్నీ చేసుకొని ప్లాను వేశారు.

"బాంబు పడటానికి ఇక మూడు నిమిషాలున్నాయి; రెండు నిమిషాలే; నిమిషమే; పదినిమిషాలే; 3 సెకండ్లే" అని సూపర్ ఫోర్ట్రెస్ విమానంనుంచి క్రింద వున్నవారికి హెచ్చరిక చేయించడానికి కూడా ఏర్పాట్లు జరిగినవి.

బాంబు ప్రయోగానికి రెండు గంటలు ముందుగానే... నౌకా సమూహంలోవున్న నావికులు, ఉద్యోగులు అందరిని ఒకరక్షిత ప్రదేశానికి చేర్చివున్నారు; ఆ నౌకా సమూహంపై అంతర్జాతీయ పతాకాన్ని స్థాపించి, నావికులు మార్చ్ చేయడానికి ఏర్పాట్లు జరిగినవి.

ఈ బాంబు ప్రయోగానికి అయ్యే వ్యయం 7 కోట్ల డాలర్లని అంచనా. 50 కోట్ల డాలర్లవుతుందని, శాస్త్రజ్ఞులు ముందుగా అంచనా చెప్పారు.

భయంకరమైన శబ్దంతో బాంబు ప్రేలగానే ఆ ప్రేలుడును రేడియోద్వారా బ్రాడ్‌కాస్ట్ చేయడానికి కూడా ఆలోచన చేశారు.

బికినీవద్ద ఈ నౌకలను చేర్చడానికి మొత్తం 230 చదరపు మైళ్ల విస్తీర్ణంగల సముద్రం వున్నది.

## ప్రజాపరిషత్తు ఎన్నికలు

1 వ పేజీ తరువాయి

కృపలాని ఫ్లేలుగారు జవాబు వ్రాసిరి. సెలం ఆసాఫ్ ప్రకాశం గారిని చూడక, తానింకా ఎన్నికల ఏర్పాటుల విషయమున ఎట్టి నిర్ణయం చేయలేదని, కృపలానిగారి లేఖకై ఎదురు చూస్తున్నానని తెలిపిరి.

ప్రధాని ప్రకాశంగారుకూడ రాజ్యాంగ సభ ఎన్నికకు నిలువబడినట్లు తెలియుచున్నది.

### గవర్నరుకి స్పీకరు సూచన

మదరాసు స్పీకరు గా॥ శివషణ్ముగం పిళ్లెగారు, అసెంబ్లీ సభా నాయకునితో సంప్రదించి, కాన్‌స్టిట్యుయంటు అసెంబ్లీ ఎన్నికలకు నామినేషనుల గడువు తేదీ 15 వ తేదీకి మార్చవలెనని కోరుచును, నామినేషను ఫారములో ప్రకటన నమూనా బెంగాలు మాదిరిగ సవరించాలని కోరుచును లేఖ వ్రాసిరి.

## సి. రాజగోపాలాచారి విమర్శ

మదరాసు, జూన్ 30: రాజ్యాంగ పరిషత్తు యెన్నికకోసము మదరాసు ప్రభుత్వమువారు నిర్ణయించిన నామినేషను ఫారము బెంగాలులో సవరించిన ఫారము మాదిరిలేదని సి. రాజగోపాలాచారిగారు తెలుపుతూ, అలా సవరించడం అవసరం కనుక సవరించేంతవరకూ నామినేషనులు దాఖలు చేసే తేదీ వాయిదా వేయవలసినదని చెప్పుచున్నారు.

బెంగాలులో జారీచేసిన ఫారము అందరికీ తృప్తిగా ఉంది. దాని సంగతియింకా మదరాసుకు తెలిసినట్లులేదు. ఈ సంగతి వెంటనే చూడాలి. సవరణ జరిగేవరకూ నామినేషనులు వాయిదాపడాలి, అని రాజగోపాలాచారిగారు కోరుచున్నారు.

మదరాసుఫారానికీ, బెంగాల్ ఫారానికీ భేదా మొక విషయంలో ఉన్నది. మే 16 ప్రకటనలోని 19 వ పేరా నిమిత్తము రాజ్యాంగ పరిషత్తుకు పోదలచినట్లు మదరాసుఫారములో చెప్పబడగా బెంగాలుఫారములో క్రొత్తభారత రాజ్యాంగము రచించే నిమిత్తము అని ఉన్నది-ఈ బెంగాలు ఫారములో లాగా సవరణ కావాలని సి. రాజగోపాలాచారి భావము.

## దరఖాస్తులు 3-వ తేదీ లోపుగా చేరాలి

ఒంగోలు, జూన్ 29: ఆంధ్రదేశమునుండి ప్రజాప్రతినిధిపరిషత్తు సభ్యులుగా నిలువగోరువారు తమ దరఖాస్తులను ఆంధ్ర రాష్ట్రీయ కాంగ్రెసు సంఘమునకును, మద్రాసు ప్రధానికిని ఒకేమారు పంపవలెనని ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెస్ సంఘాధ్యక్షులు ప్రొ॥ ఎన్. జి. రంగాగారు నేడు చెప్పిరి. "ఈ ఎన్నికల సంవత్సరమున జరుగవలసిన తంతు విషయమై యింకా వివరములు తెలుపబడలేదని నేను కాంగ్రెసు మహాసభాధ్యక్షుని కోరియున్నాను. జూలై 3 తేదిలోపుగా దరఖాస్తులు ఆం. రా. కాం. సంఘమునకు చేరవలెను. అవసరమైనయెడల తంతివార్తలుగా తెలుపవచ్చును. ప్రతి దరఖాస్తుతో 100 రూపాయల బుసుము పంపవలెను" అని ప్రొ॥ రంగాగారు చెప్పిరి. స్వ. వి.

## అసెంబ్లీ చర్చకు తీర్మానం

షిల్లాంగు, జూన్ 29: రాజ్యాంగ పరిషత్తుకు అస్సాం ఎసెంబ్లీనుండి యెన్నికయే ప్రతినిధులు సభామందిరన్నీ అస్సాం రాజ్యాంగమును స్థిరపరిచే నిమిత్తము రేపే రాష్ట్రకూట సమావేశంలో గాని రేపే రాష్ట్రశాఖా సమావేశంలో గాని పాల్గొనకదనిన్నీ, అస్సామును కలుపుకొని యేర్పరచే యే కూట రాజ్యాంగముగాని స్థాపించాలనే ప్రయత్నాన్ని నిరోధించాలనిన్నీ అస్సాం యసెంబ్లీ ప్రతినిధులకు ఆదేశమిత్వాలన్న తీర్మానమొకటి వచ్చే యసెంబ్లీ సమావేశములో చర్చకు రానున్నది. కాంగ్రెసు సభ్యుడు దంజేశ్వరశర్మ యీ తీర్మానం పంపించాడు. అస్సాం ప్రతినిధులు భారత సమితి రాజ్యాంగమును రచించి స్థిరపరిచే నిమిత్తమున్నూ అవసరమనుకుంటే అస్సాం రాజ్యాంగమును కూడా ఛాయంగా స్థిరపరిచే నిమిత్తమున్నూ, సమితి రాజ్యాంగ పరిషత్తులో పాల్గొనాలని యీ తీర్మానంలో చెప్పయున్నది.

## అంగలూరులో బాలికోన్నత పాఠశాల

### చల్లపల్లిరాణివారిచే ప్రారంభోత్సవం

గుడివాడ, జూన్ 28: నిన్న టిదినం అంగలూరులో నూతన బాలికా ఉన్నత పాఠశాల ప్రారంభోత్సవం శ్రీ చల్లపల్లి రాణీగారైన శ్రీమంతు యార్లగడ్డ వెంకటమర్గాంబా బహద్దరిణీ గారు ఎంతో వైభవంగా జరిపారు. కార్యక్రమం ప్రకారం ఆరోగ్యశాఖా మంత్రిణి శ్రీ అచంట రుక్మిణమ్మగారు కారణాంతరములవల్ల రాలేకపోయినారు. సభకు శ్రీ చల్లపల్లి రాజాగారి పోషకులు కృష్ణప్రసాద్, ఇక్కుర్తి... గారు మొదలగు పెద్దలు విచ్చేశారు.

శ్రీమతి చెముకూరి విశాలాక్షమ్మగారు పతాకోత్సవం చేశారు. తదుపరి హైస్కూలు కమిటీ అధ్యక్షుడు త్రిపురనేని సుబ్రహ్మణ్యంగారు తన స్వాగతోపన్యాసంలో యీహైస్కూలు ప్రథమమున శ్రీనందగిరి వెంకటప్పయ్య పంతులుగారిచే స్థాపింపబడినదనియు, యీ కమిటీ కార్యదర్శి శ్రీ తాతినేని నూర్యనారాయణ గారు వారి వర్గబలంతో రు 17000 పైగా విరాళములు సంపాదించిరనియు చెప్పి భవన నిర్మాణ కార్యక్రమములో తోడ్పడిన శ్రీ దుగ్గిరాల వెంకటసుబ్బయ్య, పువ్వాడ వెంకటసుబ్బయ్య (?) ప్రభృతులను కొనియాడిరి.

ప్రారంభోపన్యాసములో శ్రీ చల్లపల్లి రాణీగారు స్వాతంత్ర్యము, కళలూ స్థానమైన మన భారతదేశంలో స్త్రీవిద్య దిశాభ్యున్నతికి మార్గదాయకమనినియు అందు ముఖ్యముగా పురుషులకు యిచ్చు విద్యనే స్త్రీలకు ఇవ్వక, స్త్రీ విద్యను గుర్తించి విద్యావేత్తలును, అధికారులును, స్త్రీవిద్యా ప్రత్యేక విధానమును ఏర్పరిచి, అట్టి విద్యనే స్త్రీలకు యివ్వవలెనని ఆశించుచు, పాఠశాల దినదినాభివృద్ధికి సర్వేశ్వరుని ప్రార్థించుచు పాఠశాల ప్రారంభోత్సవం జరిపిరి.

తదుపరి కాకర్లపూడిగారు ప్రపంచంలో స్త్రీలకుగల, యివ్వవలసిన స్థానమును యిచ్చి స్త్రీ సమాజమునకు శాస్త్రీయముగా విజ్ఞానఫలము లందింపవలెను దృష్టితో యీమె తన పురజనులను ప్రోత్సహించెదననియు, తన కృషిఫలితంగా తన కీ విజయం కలిగినదనటానికి తన పురజనుల సహాయమెంతయో కొనియాడవలెననియు, వసూలు చేసిన ధనం చాలదని భయం గలిగినప్పుడు రాణిగారు ప్రయత్నమునకు ఆనందించి అనుగ్రహించిన రు. 5000 విరాళ మొసగిన శ్రీ శ్రీ శ్రీ చల్లపల్లి రాజావారి కుటుంబమునకు కృతజ్ఞతను తెల్పెను.

ఈ ఉద్యమములో తమకు తోడ్పడిన వారి కందరికిని కృతజ్ఞతను తెలియచేయుచు, తమ అహ్వానమును అంగీకరించి తమకుగల అద్వితీయ స్త్రీవిద్యాభిమానమును, ఆదరించల సంస్కారభావమును జయకట్టు బాలికోన్నత పాఠశాలను ప్రారంభింప నంగీకరించిన ఆదర్శ జననీ మణియగు శ్రీ శ్రీ చల్లపల్లి రాణీగారికి సభవారి పక్షమున అత్యంత కృతజ్ఞతా వందనము లర్పించెను.

అల్పాహార విందు అనంతరం బాలికల విచిత్ర వేష ప్రదర్శనం జరిగింది. శ్రీ త్రిపురనేని శ్యామసుందరిగారి 'గానం', ప్రవీణ ప్రభృతుల వయొలిన్‌గాన కచేరి అమ్మనబ్రోలు... గారిచే గానప్రదర్శనం కూడా జరిగింది. అధ్యక్షుని అంత్యోపన్యాసముతో శ్రీ పువ్వాడ... కృతజ్ఞతా వందనములతో సభ ముగిసింది. రాత్రి తెలుగు నాటక ప్రదర్శనం జరిగింది.

## ఆంధ్ర కాంగ్రెసు సంఘము

ఎన్నికలు వాయిదా

మద్రాసు జిల్లా కాంగ్రెసు ఎన్నికల్ను తాత్కాలికముగా వాయిదా వేయవలెనని దన్న రాష్ట్రకాంగ్రెసు సంఘాధ్యక్షుల అనుమతి ప్రకారము వాయిదా వేయడమైనది. తిరిగి యెన్నికలు యెప్పుడు జరుగునది ముందుగను ప్రకటింపబడును.

పొన్నేరి రామకృష్ణయ్య,
ఎన్నికోద్యోగి.

## సాహిత్య సభ

2-7-46 సాయంత్రం 6 గంటలకు ఆంధ్ర సాహిత్య సభలో "...కవిత్వానికి ... " అను విషయం మీద శ్రీ దేవరాజు కృష్ణశర్మ శ్రీరంగం నారాయణబాబు ఉపన్యసిస్తారు. శ్రీ శ్రీనివాస శిరోమణిగారు అధ్యక్షత వహిస్తారు.

### ఆంధ్ర కళామండలి

3 వ తేదీ సాయంకాలం 5-30 గంటలకు ఆంధ్ర కళామండలి యాజమాన్యమున శ్రీ శ్రీ శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం కవిగారి వార్షికసభ వై. యం. సి. ఎ. ఆడిటోరియం, ఎస్ప్లనేడ్ యందు జరుగును.

ప్రచారశాఖామంత్రి గా॥ వేమువుల కూర్మయ్యగారు అధ్యక్షత వహింతురు. శ్రీ జంధ్యాల... శాస్త్రి ... ఉపన్యసింతురు.

